శ్రీః.

# శ్రీరామావతారతత్త్వము

## ఎనిమిదవ ప్రకరణము

ఇయ్యది
కడప మునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు
కావ్యస్మృతితీర్థ:
జనమంచి శేషాద్రిశర్మ విరచితము.

ఓం

శ్రీ



చెన్నపురి:
శ్రీ 'రామ' ముద్రాక్షరశాలయందు
ముద్రితము.
1935.

శ్రీః.

# విజ్ఞప్తి.

మహాశయులారా!

శ్రీరామావతారతత్త్వమున నెనిమిదవప్రకరణము
నీనాఁటికి మీచెంత నుంచుభాగ్యము గలిగించినభగవంతు
నెన్నుచున్నాను. ఇయ్యది పూర్తియై యాఱునెలలైనను వెలువ
రింపకుండుటకుం గతం బెద్ది యనుశంక యంకురింపక పోదు గదా.

“ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్య చ కర్మణః,
క్షిప్రమక్రియమాణస్య కాలః పిబతి సంపదః.”

అన్నసూక్తి ననుసరించి గతమాఘమాసమున గ్రంథత్రయా
విష్కరణమహోత్సవము జరపునూహ యొకఁ డుదయించెను.
“ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథాః” అన్న
ప్రాక్తనసూక్తిరీతి నాయూహ నపుడే యంతరింపక యించుక
తడవు పొడవుగ నిగిడె. మృగతృష్ణాప్రవాహముం గని
యుదన్యాపనోదనంబునకయి ప్రధావించువానిలాగునఁ దదుత్స
వనిర్వాహణావ్యగ్రమనస్కుల యాశయములు ఫలవంతము
లగునన్న నమ్మిక దీనిం బ్రకటింపక మానమేషము లెన్నుచు
నూరకుండితి. ఇదియుఁ దాండవకృష్ణభాగవతము నొక్క
సారియే యచ్చొత్తింప నారంభించుటం జేసి రెండు నొకసారి
వెలువడుట కడుమేలని నాకుఁ దోఁచుటయు నుత్సవప్రయత్న

ము లవె యివె యనునుడులు వినఁబడుటయు మఱింత నన్ను శ్రద్ధావంతునిగ నొనరించె. "ఆశాపాశము తాఁ గడున్నిడుపు లేదంతంబు" అను మహాత్ములవాక్కు ననుసరించి వ్రాయు చుండిన "శ్రీసర్వమంగళాపరిణయము" కూడఁ బూర్తిసల్పించి ముద్రించి యీయుత్సవమునఁ గలుపవలయునను నభిలాషము మూర్తీభవించె. దానికనుగుణముగా నించుక ధనలాభము కలిగి మఱింత నామది వేధించె. ఏదోమహార్థమును సాధింపఁ బూను యోగిలాగునఁ దదేకతత్పరత దానిశిష్టభాగము నేని మిదివందలపద్యముల నల్లి ముద్రించితి- పైనఁ జెప్పిన గ్రంథత్రయావిష్కరణమహోత్సవమన్న దిద్దానిం గలిసికొనే యని యెన్నఁదగు మ-రా-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారి యనుగ్రహవిశేషమున నీపని సరగసాగెఁ గాని బహుముఖసాధ్యమగుట నాయుత్సవప్రయత్నము నిరాశఁ గొలుపక యాశం బెంపొందింపక త్రిశంకుస్వర్గమువలె నుం డెను. దినములు వారములు పక్షములు మాసములు గడ చెను. క్రమక్రమముగ "నానాఁటికిఁ దీసికట్టు నాగంభట్టూ" యన్నట్టు నిస్పృహాంజెంద నవకాశము కలుగ నారంభించెను. కాని యదిట్టైన దార్ఢ్యము కాక "ఉభయకూలకుముద్గత శాద్వలభ్రమగతాగత ఖిన్నగవీదృశామ్" అన్నసూక్తి కుదా హరణముగా నడుమనడుమ దూర మాలోచింపఁగా నవకాశ మున కెడమిచ్చుచుఁ జెంతకుం జరగ నిస్పృహకుఁ జో టొసం గుచుఁ గాలము సాగఁజేసె. మతిమంతులయ్యు నసమానకార్య నిర్వహణశక్తియుక్తు లయ్యు నేల యీలీల నీకార్యము సాగింపకున్న వా రనునూహ పొడకట్టినపుడెల్ల "దైవంబు ప్రతికూలంబైనఁ బురుషకారంబెల్ల వ్యర్థంబై చను" నను

మాట స్ఫురింపసాగె. ఇంకను గొడ్డలి నానవేయుట మంచిది కాదని ప్రకటింప నెంచితిని. కావున నింతయాలస్యమునకుఁ బాఠకమహాశయులు నన్ను మన్నింతురు గాక యని వినయమున వేఁడుచున్నాఁడను. ముందెప్పుడు నిట్టిప్రమాదమునకు లోనుగానని యుఁ దెలుప సాహసించితిని. క్షమింపుఁడు.

పాఠకమహాశయులారా! కిష్కింధాకాండము ఏతత్ప్రకరణమునఁ బూర్తి నొందినది. నాలుగుకాండములు పూర్తినొందించితినని తెలుపుకొనుచున్నాను. ఇఁక మూఁడు కాండము లున్నవి. ఏడెనిమిది ప్రకరణములలో ముగియవచ్చు. ధనశక్తులు రెండుండినఁగాని యప్పని నెఱవేఱదు. నాయీ ప్రయత్నము సత్ప్రయత్నమైనఁ దప్పక నెఱవేఱునన్న నమ్మకమే నాకుఁ గలదు. కర్తృత్వ మాపరమేశ్వరునిదై యున్నది. భయంపడి వెనుకంజవేయనేల?

> “కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
> మా కర్మఫలహేతుర్భూ ర్మా తే సంగోఽస్త్వకర్మణి. ౪౭
> యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
> సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే.” ౪౮

అను శ్రీకృష్ణపరమాత్మవాక్కులు స్మృతిగోచరము లగుచుండ జంకు గలుగుటెట్లు?

ఈప్రకరణమున శ్రీరామ సుగ్రీవ సమాగమము మొదలు హనుమదాదులు సాగరముకడఁ జేరఁగా దానిని దాఁటుటెట్లనునూహలు గలుగుట, తుదకు హనుమంతుఁ డందుల కంగీకరించుట యనుదనుకఁ గలకథాభాగము కలదు. ఇందనేక విశేషవిషయములు గలవు. ఆయాకథలం బఠించునపు డందుఁగల సారమేమని తర్కింపవలయును. భగవన్మహా

త్త్వము నెఱుఁగందగియుండు. అది తెలియఁ దరముగాదని
వదలరాదు. బుద్ధిపాత్రము భగవన్మహత్త్వసాగరమున నోపి
నంతజలమును గ్రహింపఁ గల్గు. దానఁ దరింప నవకాశము
కల్గును. తత్త్వ మిది యని తెలుపువారు లేరే యని భయం
పడరాదు. అది దురాత్ముల లక్షణము. శ్రద్ధయనునది సార
మును గ్రహింప నవకాశ మొసంగు. ఎవరైన నన్నెఱుంగఁ
గోరువారు కలరా యని వేచియుండు భగవంతుఁ డట్టివారి
కెట్టులో తనతత్త్వము తెలియఁజేయఁ దలఁచు. సంకల్పమాత్ర
మున సకలబ్రహ్మాండములసృజించు పరాత్పరునకు నిది యెంతటి
పని? కావున శ్రద్ధగలవారల కెఱుఁగరానివిషయము లుండవు.
అట్టిశ్రద్ధ కలుగవలయునన్న సత్కర్మానుష్ఠానము ముఖ్యము.
అట్టివిధుల నాచరించువారికిఁ దరణోపాయము దొరక
దనుటకంటె నీచాభిప్రాయము లేదు. శిష్యవిత్తాపహారకు లగు
గురువు లీకార్యమునకుఁ బనికిరారు. శిష్యహృత్తాపహారకులే
కావలయు. వారికి ధన మక్కఱలేదు. కనిపెట్టియుందురు.
శ్రద్ధ మది పొడమగనే మోమున నొకయపూర్వతేజస్సు
వెలయు. దానిం గాంచి వారలే వచ్చి యుపదేశింతురు. దీనికే
మార్జాలకిశోరన్యాయమని వేదాంతు లనువదింతురు. శిష్యో
ద్ధారణతత్పరులే గురువులని దాని తాత్పర్యము. ఆయర్థము
నీకాండము మనకు బోధించును. ఆయాయిఘట్టముల నా
యెఱింగినంతదనుక నీవిషయమును వ్రాసితిని. సర్వజ్ఞుఁడను
గాదు కదా. అల్పజ్ఞుఁడ నగు నావ్రాఁతలయందు లోపము లేల
యుండకయుండు? వానిని బెద్ద లీసడింపక మన్నింతురు.
తెలుపఁదగినవానిం దెలుపుదురు. శిష్యవిత్తాపహారకులు
మఱియు,

"ధర్మధ్వజీ సదాలుబ్ధ శ్ఛాద్మికో లోకదంభకః,
బైడాలవ్రతికో జ్ఞేయో హింస్రస్సర్వాభిసంధకః. ౧౯౫
అధోదృష్టిర్నైష్కృతికస్స్వార్థసాధనతత్పరః,
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః. ౧౯౬
యే బకవ్రతినో విప్రా యేచ మార్జారలింగినః,
తే పతంత్యంధతామిస్రే తేన పాపేన కర్మణా. ౧౯౭
న ధర్మస్యాపదేశేన పాపం కృత్వా వ్రతం చరేత్,
వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్ స్త్రీశూద్రదంభనం." ౧౯౮

మనుస్మృతి. ౪ అ.

అను నీమనుస్మృత్యుక్తబైడాలవ్రతబకవ్రతపరాయణులు శిష్యులకుఁ దెలిపి వారి నుద్ధరింపఁ జాలరు. తాము తీర్ణు లయినఁగదా వేఱొకరి నుద్ధరింప సమర్థులగుట. ధనాశాపరవశులకు భగవదనుగ్రహమునకు నెంతదూరము ? పరమేశ్వరుఁడు మానవుని బాహ్యచిహ్నములఁ జూడఁడు. అంతఃకరణశుద్ధినే గాంచును. కావున బాహ్యచిహ్నములే ప్రధానములనుకొను కపటనాటకసూత్రధారులకు భగవదనుగ్రహము గగనారవిందమే. కావున నట్లుగాక యంతఃకరణశుద్ధిగలిగి పదార్థసంగ్రహణతత్పరత్వమును మాని భగవంతుని,

"పత్త్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.
అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం."

అను పరమేశ్వరోక్తి ననుసరించి యథాశక్తిన్యాయము ననుకరించి యుపచారవిశేషముల నారాధింపవలయును. ప్రతిదిన మొక లోహపాషాణాదినిర్మితవిగ్రహమున కొన్నియుపచా

రము లొనరించినను వ్యర్థమే కాని సత్ఫల మద్దానిం గలుగదు.
భగవదుపాసన యది కానేరదు.

౧ వస్తుస్వరూపానపేక్షం పురుషేచ్ఛామాత్రతంత్రం మానస ప్రవాహః. ఉపాసనా.

౨ మంత్రోదితార్థస్యేతికర్తవ్యతా బోధనత్వ ముపాసనాకాండత్వమ్.

అని సర్వసిద్ధాంతపదార్థలక్షణసంగ్రహము తెలుపుచున్నది.

"భవతు అలంబహునా వాగ్జాలేన. యోఽస్యవిశ్వస్య ఆకాశవత్సర్వదా సర్వత్ర ఓతప్రోతస్వరూపేణ అంతర్బహిర్విరాజతే తస్య సర్వవ్యాపినః పరమపురుషస్య స్వరూపభావే యావన్నసాధకస్య స్వహృదయే ధారణాధ్యానాదిభిః స్థైర్యమాపద్యతే తావదర్చాదావేవోపాసనా కార్యా దుర్బలాధికారిణేత్యేవ నిష్కర్షః. తథా హి కులార్ణవతంత్రే. ౬ ఉల్లాసే.—

'చిన్మయస్యాప్రమేయస్య నిర్గుణస్యాశరీరిణః,
సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా,
అరూపిణం రూపిణం కృత్వా కర్మకాండరతా నరాః,
బ్రహ్మజ్ఞానామృతానందపరాస్సుకృతినో నరాః.'

కించ తత్రైవ నవమోల్లాసే.

'నిర్విశేషం పరం బ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః,
యే మందాస్తే ఽనుకల్ప్యంతే సవిశేషనిరూపణైః.'

అధికారిభేదేనాలంబనీయోపాస్యదేవస్యాపి భేదః ప్రదర్శితః,

యథా తత్రైవ నవమోల్లాసే.

'అగ్నౌ తిష్ఠతి విప్రాణాం హృది దేవో మనీషిణాం,
ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్రవిదితాత్మనామ్.'

శ్రీభాగవతే ౩. ౧౯. ౨౫.

'అర్చాదావర్చయేత్తావదీశ్వరం మాం స్వకర్మకృత్,
యావన్న వేద స్వహృది సర్వభూతేష్వవస్థితమ్." శబ్దకల్పద్రుమము.

అను నీప్రమాణములు పైన వ్రాసినవిషయమును సిద్ధాంతము చేయుచున్నవి. కావున నుపాసకుఁడు హృదయకమలమున నభీష్టదేవతామూర్తిని నెలకొలిపి దానిని జూచుచుండుటయే యుపాసనయని సిద్ధాంతము. మంత్రజప మద్దాని సిద్ధింపఁ జేయునిమిత్తమే యని యెఱుఁగందగు. ఆధ్యానయోగసిద్ధ్యనంతర మీ మంత్రజపము కూడ నవలవచ్చును.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః.

అన్న గీతావాక్యముకూడ నీభావమును దృఢపఱచుచున్నది. భగవదారాధనమున కనేకమార్గములు ప్రతిపాదింపఁబడినవి. అందు నధికారిభేదము ననుసరించి యుపయోగించుకొనవచ్చును. ఈప్రకరణమున నందందు నీవిషయములు తెలుపఁబడినవి. శ్రీరామునిమహత్త్వము వెల్లడించుతావుల నా వ్రాసిన విశేషార్థములు పండితులు విమర్శించి ప్రమాదములను క్షమింతురు గాక. అసూయాపిశాచికావేశపరవశనిజాంతఃకరణులు దూషించినను విచారము కలుగదు. పండితు లట్టులొనరింపక మేలుగోరి తత్త్వమిదియని యుపదేశింతురు. అదియే పురోవృద్ధికి మార్గము. దానినే కోరుచున్నాను. ఇంతకంటె మించి పెంచి వ్రాయఁదగినవిశేషములు లేవు.

ఇట్లు, విన్నవించు విద్వద్విధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.
శ్రీ. శ్రీ. శ్రీ.

# ఉద్ధారకులు

మ-రా-శ్రీ, మడిపల్లి సూర్యనారాయణమూర్తిగారు, ఆనపర్తి, జి॥ గోదావరి.

,, అయ్యగారి బుస్సెట్టిగారు, కణేకల్లు, బళ్లారి.

---

# పోషకులు

మ-రా-శ్రీ, అక్కెనప్రెగడ లక్ష్మీనారాయణరావుగారు,
బి. ఏ., బి. ఇ., ఇంజనీయర్‌గారు, బళ్లారి.

,, వేచిరాజు రామరావుగారు, గుంటూరు.

,, ఏ. టి. వి. ఆర్. నరసింహస్వామిగారు, ఉపాధ్యాయులు,
వాడపల్లి, జి॥ గోదావరి.

,, కలగ నరసింహముగారు, ఉపాధ్యాయులు, దొమ్మేరు.

,, నరసింహదేవర వేంకటశాస్త్రులుగారు ,,

,, పైడా రామకృష్ణయ్యగారు, జమీందారులు, కాకినాడ.

,, బొమ్మిసెట్టి లక్ష్మీనరసింహస్వామిగారు, నెల్లూరు.

,, వెలంపల్లి రామకృష్ణమ్మశ్రేష్ఠిగారు, కాకినాడ.

,, వవ్వేటి విశ్వనాథరావుగారు, బి. ఏ., బి. యల్., కాకినాడ.

,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కుల్లూరు.

,, దరిమడుగుల చలమయ్యగారు ,,

,, కోట వేంకటరామయ్యగారు ,,

,, బచ్చు చంద్రమౌళిగారు, ముసునూరువారిపాలెము.

మ-రా-శ్రీ, అల్లాడి జగన్నాథశాస్త్రులుగారు, బి.ఏ.,ఎల్.టి., హెడ్మాష్టర్, బి. ఆర్. హైస్కూల్, వేంకటగిరి టౌన్.

,, జంగా లక్ష్మీనరసింహశాస్త్రులుగారు, ఉపాధ్యాయులు, కడప.

,, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు ,,

,, గార్లదిన్నె రామేశ్వరరావుగారు,బి.ఏ., బి.యల్., అడ్వకేటు, కడప.

,, బత్తులపల్లె శేషగిరిరావుగారు, రామరాజుపల్లె, కడప.

,, కాట్రపాటి చలపతిరావుగారు, కడప.

,, సముఖము శ్రీనివాసులునాయుడుగారు, ఇంగ్లీషు హెడ్ అకౌంటెంటు, కడప.

,, యల్. నరసింహయ్యగారు, ఎద్దులాయగారి కొత్తపల్లె.

,, కల్లము వీరయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు.

,, జూటూరు నాగమయ్యశ్రేష్ఠిగారు ,,

,, దేవరకొండ సుబ్రహ్మణ్యముగారు, పాటూరు.

,, పుట్టమురెడ్డి చలమారెడ్డిగారు, పంచాయతి ప్రెసిడెంటు, మంకపనుపల్లె.

,, ఆకేపాటి తిరుమలరెడ్డిగారు, గ్రామమునిసిఫ్.

,, పురిగండ్ల చెంగయ్యగారు, నాజర్, సెంపలూరు.

,, యూదాళ్ల బాలసుబ్బయ్యశ్రేష్ఠిగారు, బెడుసుపల్లి.

,, నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు, బి.ఏ., ప్లీడర్, గుత్తి.

,, సిద్ధనవము వెంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడర్ ,,

,, వి|| కొప్రెశాచార్యులుగారు, బి. ఏ.,బి.ఇ.డి., ఉపాధ్యాయులు, గుత్తి.

,, ఆర్కాటు వెంకోబరావుగారు, పెన్షనర్, గుత్తి.

,, కాన్గోవి నరసింగరావుగారు, పెన్షనర్ ఉపాధ్యాయులు,గుత్తి.

మ-రా-శ్రీ, ఉప్పర్లపల్లె రంగాచార్యులుగారు, తెలుగుపండితులు,
హైస్కూల్. గుత్తి.

,, వై॥ కొండలరావుగారు, ఉపాధ్యాయులు, గుత్తి.

,, ఓ. ఐ. శౌరిరెడ్డిగారు, ఎమ్. ఏ., బి.యల్., వకీలు, గుత్తి.

,, కే. వెంకటరావుగారు, అనుంపల్లి.

,, జంబులపాడు పెద్దవెంకటప్పగారు, పస్పుల, గుత్తితాలూకా.

,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు.

,, రాచర్ల తిప్పయ్యగుప్తగారు, బెళుగుప్ప.

,, కరణము కృష్ణరావుగారు, బేవినహళ్లి, అనంతపురంజిల్లా.

,, బి. రంగాచార్యులుగారు, కిరికెర ,,

,, కే. లింగప్పగారు, కిరికెర ,,

,, వెలమకూరు ఆత్మారామప్పగారు, అనంతపురము.

,, ఇంజేటి సుబ్బరామరావుగారు ,,

,, గాదంసెట్టి సుబ్బయ్యశ్రేష్ఠిగారు, కిరికెర, అనంతపురంజిల్లా.

,, కట్టా ఆత్మారామయ్యశ్రేష్ఠిగారు, హిందూపురము.

,, పొప్పిసెట్టి ఆదినారాయణశ్రేష్ఠిగారు, హిందూపురము.

,, దొంతి భీమయ్యశ్రేష్ఠిగారు ,,

,, హెచ్. బి. లక్ష్మణాచార్యులుగారు, పరిగి, హిందూపురము.

,, కట్టా మాధవయ్యగారి నారప్పశ్రేష్ఠిగారు ,,

,, మాకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు,,

,, కంబము శ్రీనివాసరావుగారు, రిటైర్డు హుజూర్ ట్రెజరర్,
బుక్కరాయసముద్రము.

,, యాదాటి తిమ్మయ్యగారు, అనంతపురము.

,, కే. యస్. రాఘవాచార్యులుగారు, బి.ఏ., బి.యల్., వకీలు,
అనంతపురము.

మ-రా-శ్రీ, మాశీనల్లి నారాయణరావుగారు. వకీలు, అనంతపురము.

,, శ్రీనంతము సుబ్బయ్యగారు, ఆంధ్రవిశ్వకళాపరిషత్సభ్యులు, అనంతపురము.

,, అంగలకొట్ల కృష్ణమూర్తిరావుగారు, వకీలుగుమస్తా, అనంతపురము.

,, చిట్టా శేషప్పశ్రేష్ఠిగారు, బళ్లారి.

,, రావుసాహెబు జే. సాంబయ్యశ్రేష్ఠిగారు ,,

,, బిళ్లారిశెట్టి సుంకప్రస్థానాయుడుగారు. బి. ఏ., తహశీల్దారు, బళ్లారి.

,, నెనసూరు భీమప్పగారు, బళ్లారి.

,, శ్రీమతి. వై. రామాంబగారు ,,

,, రెడ్డి లింగయ్యగారు, బి. ఏ., బి. యల్., అడిషనల్ మునిసిఫ్, గుంటూరు.

,, పర్వతము రాజేశ్వరరావుపంతులుగారు, బెజవాడ.

,, పుల్లెల వెంకటరమణయ్యగారు, ఇచ్ఛాపురము.

,, కొల్లా జోగయ్యగారు, మదరాసు.

,, దోగుపర్తి వెంకటసుబ్బారావుగారు, మదరాసు.

,, ధారారాజు వెంకటరమణరావుగారు, చిన్నలింగసముద్రము.

# విషయసూచిక.


| విషయము. | | పుట. |
|---|---|---|
| అవైదికమతములు | ... | 1 |
| చిహ్నములు | ... | 7 |
| శ్రీరామలక్ష్మణులం గాంచి సుగ్రీవుండు భయంపడుట | ... | 14 |
| సుగ్రీవుండు రాఘవులకడకు మారుతిం బంపుట | ... | 39 |
| హనుమంతుండు శ్రీరామసౌమిత్రులం గని భాషించుట | ... | 43 |
| సౌమిత్రి తమవృత్తాంతమును హనుమంతున కెఱింగించుట | ... | 54 |
| రామసుగ్రీవసఖ్యము | ... | 66 |
| రామునికార్యమునకుం దోడ్పడ సుగ్రీవుండు సమయము చేయుట | | 80 |
| శ్రీరామసుగ్రీవులశపథములు | ... | 91 |
| శ్రీరామునితో సుగ్రీవుండు తనకష్టపరంపరలం జెప్పుట | ... | 101 |
| వాలి దుర్వృత్తులను సుగ్రీవుండు రామునకుం దెల్పుట | ... | 111 |
| వాలి సుగ్రీవుని వెడలంగొట్టుట | ... | 112 |
| సుగ్రీవుండు వాలికింగలశాపముం దెల్పి శ్రీరాముని బలము తెలియం గోరుట | ... | 117 |
| సుగ్రీవకృత రామస్తుతి | ... | 137 |
| వాలిసుగ్రీవుల తొలియుద్ధము | ... | 141 |
| రామాదులు రెండవసారి కిష్కింధ కరుగుట | ... | 154 |
| శ్రీరాముఁడు సుగ్రీవుని భీతిమాన్పుట | ... | 160 |
| వాలి యుద్ధమునకుం బయనము చేయంబూనం దార వలదని హితముం దెలుపుట | ... | 167 |
| వాలి శ్రీరామబాణమునకు లక్ష్యమగుట | ... | 178 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| శతవలి లోనగువా రుత్తరమున కరుగుట | ... | 345 |
| శ్రీరాముఁ డంగుళీయకమును హనుమ కిచ్చుట | ... | 349 |
| వానరసన్నాహము | ... | 353 |
| శ్రీరామునితో సుగ్రీవుఁడు తనవుఁగల లోకజ్ఞానముఁ దెల్పుట | | 354 |
| వానరులు వచ్చి తమవార్తలఁ దెల్పుట | ... | ,, |
| హనుమదాదు లొకరక్కసుని జంపుట | ... | 355 |
| హనుమదాదులు మరల వెదుకసారంభించుట | ... | 357 |
| హనుమదాదులు ఋక్షబిలమున స్వయంప్రభను జూచుట | ... | 358 |
| ఋక్షబిలవృత్తాంతమును స్వయంప్రభ కపులకుఁ జెప్పుట | ... | 360 |
| స్వయంప్రభకుఁ దమవృత్తాంతమును హనుమ దెల్పుట | ... | 371 |
| స్వయంప్రభ వానరులను దపశ్శక్తిచే గుహనుండి వెడలించుట | | 372 |
| హనుమ సుగ్రీవునికడకుఁ బోవుదమనుట | ... | 376 |
| అంగదాదులు ప్రాయోపవిష్టు లగుట | ... | 378 |
| సంపాతి వచ్చుట: వానరులు దుఃఖించుట | ... | 380 |
| సంపాతి వానరులతో సంభాషించుట | ... | 382 |
| సంపాతి సీతయుండుస్థలము వానరులకుఁ దెల్పుట | ... | 386 |
| జాంబవంతునకు సంపాతి సీతాపహరణవార్త తెలిసినవిధముఁ దెల్పుట | | 395 |
| సంపాతి స్వవార్తను దెలుపుట | ... | 397 |
| సంపాతి నిశాకరమునికిఁ దనవార్తఁ దెల్పుట | ... | 398 |
| ముని సంపాతికి ఱెక్కలువచ్చుమార్గము తెల్పుట | ... | 399 |
| సంపాతికిఁ బక్షములురాఁగా హితముఁదెలిపి వానరుల వీడ్కొనుట | | 403 |
| వానరులు సాగరముకడ కరుగుట | ... | 406 |
| వానరులు తమశక్తిని దెల్పుట | ... | 407 |
| జాంబవంతుఁడు హనుమంతుని బ్రోత్సహించుట | ... | 414 |
| హనుమ తన వృత్తాంతమును దెల్పి లంకకుంబోవఁ బయనమగుట | | 422 |

శ్రీః

# శ్రీరామావతారతత్త్వము

## కిష్కింధాకాండము.

### అష్టమప్రకరణము.

శ్లో॥ సకలభువనరత్నం సర్వశాస్త్రార్థరత్నం
సమరవిజయరత్నం సచ్చిదానందరత్నం,
దశముఖనాశరత్నం దానవారాతిరత్నం
రఘుకులమణిరత్నం పాతు మాం రామరత్నమ్. ౧

లోకాభిరామం నయనాభిరామం వాచాభిరామం వదనాభిరామం,
సర్వాభిరామం చ సదాభిరామం వందే సదా దాశరథిం చ రామమ్. ౨

జయజయ రఘురామ శ్రీముఖాంభోజభానో
జయజయ రఘువీర శ్రీమదంభోజనేత్ర,
జయజయ రఘునాథ శ్రీకరాభ్యర్చితాంఘ్రే
జయజయ రఘువర్య శ్రీశ కారుణ్యసింధో. ౩

శ్రీరామేత్యాదరాద్వక్తుం మనో యస్య ప్రవర్తతే,
వైకుంఠవాసినస్తస్య సులభో నాత్ర సంశయః. ౪

శత్రుచ్ఛేదైకమంత్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోచ్ఛేదమంత్రం సముచితసమయే సంగనిర్యాణమంత్రం,
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే శ్రీరామమంత్రం జపజప సఫలం జన్మసాఫల్యమంత్రమ్. ౫

విజ్ఞానధనులారా! నిష్పక్షపాతమతులారా!

శ్రీరామావతారతత్త్వమునందు సమస్తప్రకరణములను జక్కఁగాఁ జదివియుందురు. అందుఁ గల భగవత్తత్త్వవిశేషములం గనుఁగొని యానందించియే యుందురు. శ్రీరామచంద్రుఁడు మాయామానుషుఁడని మీమనస్సులకుఁ స్ఫురించియుండు ననుట నిక్కము. రావణుఁడు మారీచునికడ కేగి యతని ప్రబోధమును బాటింపక శ్రీరామునిమహత్త్వము నెఱింగియు దానిని లెక్కింపక వానిని శ్రీరామాశ్రమమునకు సాగనంపి తన్మూలమున శ్రీరామలక్ష్మణుల నాశ్రమమున లేకుండఁ జేసి సీతాదేవి సంభాషణముల కలరియు నామెను జేకొని జటాయువుం బడఁ గొట్టి లంక కరుగుటయు, నామె నం దశోకవనమున నునిచి రాక్షసస్త్రీలను గాఁపుంచుటయు, శ్రీరామమూర్తి మారీచుని వధించి యాశ్రమమునకుఁ దమ్ముని గూడివచ్చి సీతఁ గానక వగచుచు జటాయువునకు సత్పదము ననుగ్రహించి కబంధుని వధియించి శబరిపూజలం గైకొని యామె ననుగ్రహించి పంపాసరస్సున కరుగుట యనునీకథలం బఠియించి తత్త్వవిశేషార్థములఁ జక్కఁగా విమర్శించియే యుందురు. దానం జేసి మాయామానవత్వప్రదర్శనము తేటపడియెఁగదా. ఆశ్రితత్రాణవిషయమున శ్రీరాముఁ డెట్టిపారాయణత్వమును వహించెనో యీప్రకరణమున స్పష్టమయ్యెంగదా. రావణుఁడు సీతావచనముల కెట్టి యర్థముగలమాటలచే బదులు చెప్పెనో మీ రెఱింగితిరి. ఆతనిచిత్తవృత్తి యెట్టిదై యుండు నదియు మీ యూహలకుఁ దగిలియే యుండును. ఇట్టి భాగములయందు మూలమునుండి యీయర్థమును గ్రహింపవలసియుండునని నేవ్రాసిన విశేషార్థములను నిష్పక్షపాతమతి మీరు విమర్శించి

యుండు ననుకొనియెదను. మతతత్త్వ మెట్టి దని విమర్శింపఁ జాలక దానిం దూలనాడు స్వర్ణాకర్షణాభైరవోపాసకుల యూహాలు సత్యేతరములని మీకుఁ దోఁచియే యుండును. నీటిపై భాగమువలె భక్తి యుండవలయునుగాని తన యిష్టదైవము గాని దేవతలయందు నైచ్యమారోపించి తద్భక్తులను దూలనాడ రాదు.

> "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
> ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
> యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
> తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
> సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
> సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౩౧
>
> గీత. ౬-అధ్యా.

అను శ్రీగీతావాక్యములను బరికించినచో నితరుల యిష్టదేవతలకుఁ దనయిష్టదేవతకు భేదమును గల్పింప నవకాశ మెట్లొదవును? భగవంతుఁడే సర్వరూపముల నెల్లయెడల నిండియుండఁగాఁ బ్రచ్ఛన్నమగునది యేదియు లేదనియే భక్తుఁడు చూడవలయును. లేనిచో నాతఁడు భక్తుఁడే కాకపోవును. భక్తి యనునది జ్ఞానవైరాగ్యసత్కర్మానుష్ఠానఫలరూపముగాని వానిని విడిచియుండఁజాలదు. వాని సమష్టిరూపమే భక్తి. అహంకారశూన్యత్వమే భక్తికి ఫలము. నేను గర్తను. అనుభావము నశించినఁగాని భక్తి ఫలవంతము గానేరదు. కనుక భక్తుని లక్షణము సమదర్శనత్వమే. భిన్నదర్శనత్వము పామరలక్షణము. "ఒక్కరూపముననే భగవంతుఁ డుండును. ఒక్క నామమే యతనికిష్టము. ఒక్కలోకమునందే యతఁడుండును.

కొన్ని చిహ్నములే యతనికిం బ్రీతిని గల్గించును. అవి లేని వా
నెట్టివానినైన నతఁ డంగీకరింపఁడు" అను సిద్ధాంతులు స్వల్ప
బుద్ధులకు సమ్మతములే గాని మహాత్ములు జగద్గురువులు
నగువారికి సమ్మతములు కాఁజాలవు. బాహ్యచిహ్నములను
బ్రేమించువారు పామరులు. అవి లేనున్న భగవంతుని కృప
గలుగదేమో యనుభీతి వారలను నుండును. ఏల? సోహంటు
రామన్నలు గురువులయి యుపదేశించుటం జేసి యాభీతి
వారలమనస్సులయందు నాటుకొన్నది. అట్లుగాక భక్తిని కే
రూపనామచిహ్నము లిష్టములో వానిని గలవానినిగా నిష్ట
దైవమును భావించి యారాధింపవలయు నని గురువు లుప దే
శించియున్న నిట్టిదుష్టవర్తనము వారల కలుగకయే యుండును.
శిష్యవిత్తాపహారకులగు గురువులు పెక్కండ్రు ప్రబలుట
జేసియు శిష్యహృత్తాపహారకులు విరళముగ నుండుట
జేసియు నిట్టి యుపద్రవములు తఱచుగాఁ గల్గుచుండును.
ఆ యుపద్రవములే లేనియెడల భక్తి యెంత నిర్మలముగా
నుండునో వేఱుగాఁ జెప్పవలయునా?

## అవైదికమతములు.

ఇప్పట్టున నొక్క విషయము స్మృతిగోచర మగుచున్నది.
దాని వదలుట న్యాయ్యము గాదని తోఁచెను. కాన వ్రాయు
చున్నాను. ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము ననుని
మూఁడు మాత్రమే వైదికమతములు. అనఁగా వేదసమ్మతము
లైనవి. తక్కినవి కావు. ఏలయనఁగా నవి వేదములు పోషు
షేయము లనునవి. అను నీవాదము క్రొత్తది కాదు. వైదికము
లనఁబడు మూఁడుమతములయందును దన్మతావలంబకులు

కొందఱు స్వేతరమత మవైదికమనువారు బయలుదేఱిరి. వారి దృష్టి యెంత యల్పమో మన మూహింపఁజాలము. వారి వాదము నిస్సారమగుట మాత్రమే కాక దుస్సారమగుట దానిని మనము స్పృశింపఁ దలంపరాదు. దూరదృష్టి మనకుం గలదేని సర్వమతములు వైదికములే యనవలయును. ఎట్లనఁగా యోజింతము. భగవంతుఁ డొక్కఁడని, సర్వమున నతఁ డున్నాఁడని, తద్భిన్నమగున దేదియు లేదని సర్వమతము లంగీకరించును. ఉపనిషత్తులసార మిదిగాక వేఱేమున్నది? కాదన్నచో సర్వాంతర్యామిత్వాదిలక్షణము లేగిరిపోవును. కావున సర్వమతములు వేదసమ్మతములే యనవలయును. ఏల మన వా రట్లు వానిని భావింపలేదు? అని యడుగుదురేమో. వేదోక్తకర్మానుష్ఠానమున నామతస్థులకు వీరికిని భేదము గలదు. దానిచేత వా రట్లు భావించిరి. ప్రధానసిద్ధాంతముల యం దన్నియు సమానత నంగీకరించుచున్నవి. మోక్షవిషయమునఁ గొంతభేదము కలదు. అతీంద్రియవిషయములందు మానవబుద్ధి యొకసిద్ధాంతమును నెలుపఁజాలదని కొందఱు తెలిపిరి. అది యయుక్తిక మనరాదు. పరికింపఁగా నొక్కొక్క మానవస్థితి కొక్కొక్కమతము తోడుపడుచున్నది. అద్వైతము జ్ఞానపర్వతశిఖరమువంటిది. అది యెల్లరకు సాధ్యము కాదు. తక్కినవన్నియు బహుజనానుష్ఠేయములు కావచ్చును. లోకమున ముక్తిసామ్రాజ్యమునకుఁ దగినవారు పెక్కండ్రుండరు. భేదబుద్ధిగలవారల కొక్కమతము పనికివచ్చును. అది విశేషించి లేక భగవంతునే నమ్మిన మనకష్టము లన్నియు నతఁడే తీర్చుననుకొనువారి కొక్క మత ముపకరించును. ఆ స్థితిని మించినవారలకే యద్వైత ముపకరించును. కావుననే

దాని కర్షులు కొలఁదిగ నుండును. మతమనఁగా నున్నతస్థితికి
మానవునిఁ దెచ్చు సాధన మనవలయును. ఉత్తమము, ఉత్త
మోత్తమము, అత్యుత్తమము ననుష్ఠితులు సమానములు
కావు. ఏదాని నాశ్రయింప నర్హులెవ్వరో వారి కామతము
పనికివచ్చును. ఇతరుల కది యసంగతముగాఁ గనంబడును.
వార లద్దాని నాక్షేపించుట సహజమే. దానికి బెదరుట పాడి
గాదు. దూరదృష్టిగల మహనీయులు మతములన్నియు
మానవు నున్నతస్థితికిఁ దేఁ బ్రయత్నించు సోపానములంటి
వనియు వారివారి యోగ్యతల ననుసరించి యందందు
మెలఁగుదురనియు భావింతురు. కావున మతములెల్ల మేటిక
ములే యనవలయును. వేదములను దూషించువారు దాని
తత్త్వము నెఱుంగనివారే యని మన మూహించినచో
వారిపై నాగ్రహించు నవకాశమే యుండదు. ఆయవకాశమే
లేదేని యంతకంటె మహానంద మేదియు నుండదు.

మతములన్న పేరునఁ బామరులు పరస్పరము దూషించు
కొను నాచారము ప్రబలుచున్నది. అయ్యది భగవంతుని
యనుగ్రహమునకు మనల దూరము చేయుచు నుండును. అది
తొలంగినఁగాని సర్వజనకుఁ డగుపరాత్పరుఁడు మనల ననుగ్ర
హింపఁడు. మతసిద్ధాంతసారము తెలిసినవారెవ్వరుగాని
పరమతమును దూషింపఁ బూనరని నా విశ్వాసము. అందుఁ
గొంతభాగమున నే లవమో తెలిసినవారే కంఠమును
వ్యయించి దూఱుచుందురు. వారలకు బదులు చెప్పఁబూనిన
కొందఱు వారితోఁ గలహించుచుందురు. ఇరువురు నొక్క
రీతివారే యనవచ్చుం గదా. కనుక నట్టివారితో ననవరతము
చర్చింపక మౌనమూనుట యత్యుత్తమకార్యము.

## చిహ్నములు.

ఊర్ధ్వపుండ్రాదులే ప్రధానములనియు నవి లేకయున్న దేవతానుగ్రహము కల్గదనియుఁ గొందఱు ఘోషింతురు. "సమస్తేష్వేషు భూతేషు న లింగం ధర్మకారణమ్" అని మనుస్మృతి తెల్పుచున్నది. బాహ్యచిహ్నములు ప్రధానములే కావు. కేవల హామకులకవి యుపయోగించును. గుహాంతరాళములనుండి భగవంతు నుపాసించువారలకు వేలసంవత్సరములు గతించును. ఐహికస్మృతియే వారలకు నుండదు. అట్టివారికి సకాలస్నానాదులు లేవే యనవచ్చునా? తొలుదొలుత బాహ్యచిహ్నములు కొంత యావశ్యకములై తోఁచినను బిదప నితరులకు మార్గదర్శకములని ధరింపఁదగినవియే యయి యుండును. ఊర్ధ్వపుండ్రము ధరించినఁగాని విష్ణువుకృపకుఁ బాత్రుఁడు కాఁడనువారును, త్రిపుండ్రము ధరించినఁగాని శివానుగ్రహపాత్రుఁడు కాఁడనువారును మూఢాగ్రేసరులే యనవలయును. ఈ నెపమున నుపన్యాసవేదికలయందుఁ గోలాహలము గలిగించుట ధనార్థమేకాని వేఱుగాదు. శివవిష్ణ్వాదులు భగవంతునంశములుగాని పరతత్త్వ మిందెవ్వరును గాఁజాలరు. ఇట్టులుండఁగా విష్ణువుపాదభక్తుఁడు శివుఁడనియు, శివభక్తులకు మోక్షము కలుగదనియుఁ గేవల విష్ణుభక్తులకే నది కరతలామలకమనియు వాదించువారి కెంత హామకులో వచింప శక్యమే కాదు. మధ్వవైష్ణవులు కొందఱీవిషయమున బద్ధకంకణులు. అద్వైతమతోద్ధారకుఁ డగు శంకరభగవత్పాదాచార్యులు విష్ణుసహస్రనామములకు భాష్యము వ్రాయుటచేతనే వారు విష్ణుభక్తులని వారియాశయము. ఇంతకంటెఁ దెలివితక్కువ యేమియే నుండ

నవకాశము కలదా? తన యిష్ట దైవమగు విష్ణుని సహస్రనామములకు భాష్యమేల వ్రాయలేదని వారి ప్రశ్నము. ఇంతకంటెం గుప్రశ్నము వేఱొకటి లేదనవలయును. వారి యిష్ట దైవమనంగా వీరివలె వారు పాషండులుగారు. సన్న్యాసులు. శివవిష్ణ్వాదిభేదములు వారికి లేవు. విష్ణుశబ్దమునకు సర్వవ్యాపకుఁడనియే యర్థము. వైకుంఠలోకనివాసుఁడగు విష్ణు నామధారియని కాదు. ఈ విషయమును బరిశీలింపుఁడు.

> "కిమేకం దైవతం లోకే కిం వాప్యేకం పరాయణం,
> కం స్తువంతః కమర్చంతః ప్రాప్నుయుర్మానవాశ్శుభం. ౨
> కో ధర్మస్సర్వధర్మాణాం భవతః పరమో మతః,
> కిం జపన్ముచ్యతే జంతుర్జన్మసంసారబంధనాత్." ౩

అని భీష్ముని ధర్మరాజు ప్రశ్నించెను.

> "జగత్ప్రభుం దేవదేవమనంతం పురుషోత్తమం,
> స్తువన్నామసహస్రేణ పురుషస్సతతోత్థితః."

అని ప్రారంభించి భీష్ముఁడు సహస్రనామములఁ దెల్పెను.

ఆ ధర్మరాజే

> "త్వయాపగేయ నామాని శ్రుతానీహ జగత్పతే,
> పితామహేశాయ విభో నామాన్యాచక్ష్వ శంభవే." ౧

అని భీష్ముని బ్రశ్నించెను.

> "అశక్తోఽహం గుణాన్వక్తుం మహాదేవస్య ధీమతః,
> యో హి సర్వగతో దేవో న చ సర్వత్ర దృశ్యతే. ౩
> బ్రహ్మా విష్ణు సురేశానాం స్రష్టా చ ప్రభురేవ చ,
> బ్రహ్మాదయః పిశాచాంతా యం హి దేవా ఉపాసతే. ౪

... ... ... ... ...

కో హి శక్తో భవం జ్ఞాతుం మద్విధః పరమేశ్వరం. ౮
ఋతే నారాయణాత్పుత్ర శంఖచక్రగదాధరాత్,
ఏష విద్వాన్ గుణశ్రేష్ఠో విష్ణుః పరమదుర్జయః. ౯
దివ్యచక్షుర్మహాతేజా వీక్ష్యతే యోగచక్షుషా,
రుద్రభక్త్యా తు కృష్ణేన జగద్వ్యాప్తం మహాత్మనా." ౧౦

అను మొదలగు వాక్యములను భీష్ముఁడు తెలిపెను. విష్ణుసహస్రనామములను దెలిపిన భీష్ముండు శివసహస్రనామములఁ దెలుపునధికారము నాకు లేదనియు. అంతియగాక రుద్రభక్తుఁడగు శ్రీకృష్ణమూర్తియే వానిని దెలుప నధికారియనియుఁ దెలిపెను. మఱియు నాభీష్ముఁడే

"సురాసురగురో దేవ విష్ణో త్వం వక్తుమర్హసి,
శివాయ విష్ణురూపాయ యన్మాం పృచ్ఛద్యుధిష్ఠిరః. ౧౮
... ... ... ... ...
ఏవముక్త్వా తు భగవాన్ గుణాంస్తస్య మహాత్మనః,
ఉపస్పృశ్య శుచిర్భూత్వా కథయామాస ధీమతః." ౨౯

వాసుదేవః—

"త్వం చాపాగేయ నామాని శృణుష్వేహ కపర్దినః. ౨౬
యదవాప్తం మయా పూర్వం సాంబహేతోస్సుదుష్కరం,
... ... ... ... ...
నమోఽస్తు తే శాశ్వత సర్వయోనే
బ్రహ్మాధిపం త్వామృషయో వదంతి,
త్వామేవ నారాయణశబ్దసంజ్ఞం
త్వాం చ సత్యం ప్రవదంతి సంతః." ౪౧౨

అనుశాసనికపర్వము. ౧౪-అధ్యా.

శ్రీకృష్ణుఁడే శివసహస్రనామములు చెప్పుట యేల? శ్రీకృష్ణుఁ డప్పనికిఁ దాఁ జాల ననుటయేల? శివుని నామములచేత మహిమముగలవాఁడ నైతినని శ్రీకృష్ణుఁడే యేల చెప్పవలెను?

"యదా పుమాన్న స్వాంగేషు శిరఃపాణ్యాదిషు క్వచిత్,
పారక్య బుద్ధిం కురుతే ఏవం భూతేషు మత్పరః. ౫౩
త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతి మధిగచ్ఛతి." ౫౪
శ్రీభాగ. ౪-స్కం. ౭-అధ్యా.

"ప్రకాశం చాప్రకాశం చ జంగమం స్థావరం చ యత్,
విశ్వరూపమిదం సర్వం రుద్రనారాయణాత్మకం. ౨౧
త్వం చ మే హృదయం విష్ణో తవ చాహం హృది స్థితః,
భవాన్ సర్వస్య కార్యస్య కర్తాహ మధిదైవతం. ౨౫
తదేహి స్వస్తి తే వత్స గమిష్యామ్యంబుజప్రభ,
ఏవముక్త్వా గతో విష్ణో ర్దేవోఽంతర్ధానమీశ్వరః." ౨౬
వాయుపురాణము. ౨౫-అధ్యా.

"న తే మయ్యచ్యుతేఽజే చ భిదామణ్వపి చక్షతే,
నాత్మనశ్చ పరస్యాపి తద్యుష్మాన్వయమీమహి." ౨౧
శ్రీభా. ౧౨-స్కం. ౧౦-అధ్యా.

"ధర్మే దృఢత్వం యుధి శత్రుఘాతం యశస్తథాగ్ర్యం పరమం బలంచ,
యోగం ప్రియత్వం తవ సన్నికర్షం వృణే సుతానాంచ శతం శతాని."
అనుశాసనిక పర్వము. ౧౫-అధ్యా.

"స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః,
సర్వరూపం భవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః." ౯౪
ద్రోణ. ౨౦౨-అధ్యా.

ఈ భాగవతమహాభారతాది ప్రమాణములను బరికించిచూడఁగా విష్ణువు శివలింగపూజాతత్పరుఁడని శివభక్తవర్యుఁడని స్పష్టమే యగు. ఇట్లే శివుఁడు విష్ణుభక్తుఁడనియుఁ దెలియును. ఇట్లు విరుద్ధములుగాఁ బ్రమాణము లుండనేల యని ప్రశ్నించువా రుందురు. దీనిసార మిదియని వారు గ్రహింపవలయును. ఒక్కరిని వేఱొక్కరుగా శివకేశవులు నుతించుట మేమిరువురము భగవదంశము గలవారమే. ఉపాస్యమా తత్త్వమే. అదియే పరతత్త్వ మనంబడును. భేదబుద్ధి మాయందుఁ గలవారే పామరులని పాషండులనియుఁ జెప్పఁబడుదురు. మాయిరువురకు భేదము లేదు గాన మాలో నెవరి నారాధించినను సమానమే. మాయందు భేదమును గల్పించువారు ముక్తులు కాఁజాలరు. అనియే కదా సారము. ఈవిషయమునకు శ్రీ శంకరభగవత్పాదు లుదాహరణభూతులు. వాసుదేవుఁడన్నను శంకరుఁడన్నను సమముగా భావించువారు గనుకనే భక్తానుగ్రహార్థము విష్ణుసహస్రనామములకు భాష్యము వ్రాసిరి.

> "నారాయణః పరోఽవ్యక్తా దండమవ్యక్తసంభవమ్,
> అండస్యాంతస్త్విమే లోకాః సప్తద్వీపా చ మేదినీ."

అను భగవద్గీతావ్యాఖ్యయందలి శంకరాచార్యకృతస్తుతిఁ గాంచి మధ్యస్థులు [illegible] నిజము [illegible] శంకరాచార్యులు విష్ణుభక్తులని ప్రలపింతురు. నారాయణశబ్దము శివపరమన్నఁ [illegible] వాసుదేవుఁడే [illegible]. విష్ణువనఁగా [illegible]

> "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
> భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్న భగవద్గీతావాక్యమునందుఁ గల "ఈశ్వర" శబ్దము శివుని యందు రూఢమేల కాదు? ఓ సందియ మేని శ్రీకృష్ణుఁడు శివపాద కింకరుఁడనియే తేలును గదా. ఇందుఁ గల యీశ్వర శబ్దము రూఢము గాదందురేని శంకరాచార్యకృతస్తోత్రమున నారా యణశబ్దము రూఢము గాదనవచ్చును. అప్పుడు దేవానాం ప్రియులు నోరు మూసికొనవలసినదే. కనుక శ్రీశంకరా చార్యులమతమున సర్వము భగవన్మయమనియే. కాఁబట్టి వారు విష్ణుభక్తులని చెప్పరాదు. శంకరాచార్యులవారు భస్మధారణము చేయక యూర్ధ్వపుండ్రములను ధరించిరనుట యున్మత్తప్రలాపము. అట్టివారివిషయమునందు

> "ప్రతివచన మముష్మై నోచితం మత్త సిద్ధ్యై,
> స్వహిత మనుకరోతి గ్రామసింహస్య సింహః."

అను మధుసూదనసరస్వతులవాక్య ముదాహరణీయము కా వచ్చును.

ఇట్టి దుర్వాదము లనేకములు గలవు. వానిఁగూర్చి విశేషించి వ్రాయుట పాడిగాదు. స్థాలీపులాకన్యాయము ననుసరించి యించుక వ్రాసి పాషండముఖపిధానము గావించి తిని. ఈ యుపోద్ఘాతసార మేమనఁగాఁ త్రిమూర్తులు భగవ దంశములు. ప్రతిబ్రహ్మాండమునకును వీరు గలరు. కార్యా ర్థము భక్తానుగ్రహార్థము భగవత్కల్పితులు. ఇందేరూపమున నారాధించినను భగవంతుఁ డానందించును. ఈరూపములన్ని యు నుపాసకులకొఱకు కల్పింపఁబడినవి. ఎవ్వరి కేది యిష్టమో వా రద్దానిని భగవంతుఁ డనుభావన గల్గి యుపాసింపవల యును. ఫలము సమానమే. ఈవిషయమున జాతి మత భేద ములు లేవు. ఒకజాతికి నొకమతమునకుఁ జేరినవారికే భగవ

వనుగ్రహము గల్గునను వారలకంటె నీచు లుండరు. మనస్సు నిర్మలమై ద్వైతభావన మాని సర్వేశ్వరు నారాధించువారు తత్క్షణమే పాత్రు లగుదురు. పూజాభేదములన్నియు సమానఫలము నొసంగునవి యే. భక్తి యనునది యోగజ్ఞాన వైరాగ్యములు సత్కర్మానుష్ఠానము ననువానిరూపమే కాని వేఱుగాదు. కేవల యోగమునఁగాని జ్ఞానమునఁగాని మోక్షము లేదనువారికంటె దేవానాంప్రియులు వేఱుగనుండ నవకాశము లేదు. వీని సమ్మేళనమే భక్తి యనునది. ఈభక్తికలిగి పఠించినవారికి శ్రీరామాయణము ఫలము నొసఁగును. లేనిచోఁ గాలక్షేపమే దానికి ఫలము. శ్రీరామాయణ మిట్టి విషయములనే బోధించును గాని శరణాగతిని బోధింపదు. శ్రీరామాయణము వైష్ణవజాతికే యేర్పడినదనువారే పామరులు, వంచకులు నగుదురు. ఎల్లవారలకు నది సమానమే యగును. అందెవ్వరు భేదబుద్ధి మాని శ్రీరాముని ప్రకృతి యగు సీతాంబ నారాధింతురో వారికి సన్మార్గ మొసంగును. వంచకుల మాటలను లోఁబడి యూర్ధ్వపుండ్రములే ఫలము నొసఁగునని తలంపరాదు. ఈ చిహ్నములు నిరర్థకములు. పామరులచేత నేర్పడినవి. అవి యుండినను బాధ లేదు. లేకున్నను బాధ లేదు. నిర్మల మనస్సుమాత్రము కావలయును. సు[illegible] దానిని [illegible] వలసియు[illegible] నామమా[illegible] న్యమును [illegible] నంతవనుకు [illegible]

యును. పరమతములు సహించు నలవాటు గూడ నుండవలెను. అంతదనుక నెంతమాత్రము పరిశుద్ధముగా మనస్సు చేయ శక్యముకాదు. అద్వైతపరబ్రహ్మము శ్రీరాముఁడని భావింప వలయు. సమస్తము తన్మయమే యనుతలంపు గూడ నుండవల యును. ఇట్టి యోగ్యతలు కలవారు రామాయణమును బఠించి దాని తత్త్వము నెఱింగి యందుఁగల యర్థము ననుస రించి తమరు ప్రవర్తింప నభ్యాసము చేసికొనువారలకే రామాయణము ఫలవంతమగు. అవి లేని సాపాటురామన్న లకు నయ్యది నిష్ఫలమే యగును. ఇఁక శ్రీరామచరిత్రమును బఠింతము.

## శ్రీరామలక్ష్మణులఁ గాంచి సుగ్రీవుఁడు భయమందుట.

* శ్రీరాముఁడు సోదరుఁగలసి పంపాసరస్సున కరిగి యం దలి కమలాదులను జేపలను గాంచి వానితో సుఖింపఁ దగిన సీతావదనదృష్టులు స్మృతికిం దగులఁగా నింద్రియము కలంగ విలపించెను. సరోదర్శనమున హర్ష ముదయించెను. దాన నింద్రియములు చంచలించెను. సీత తలంపునను రాఁగాఁ గామవశుఁడై తమ్మునింగని యిట్లు పలికెను. వత్సా! ఇందలి జలము వైడూర్యమణివలె నిర్మలముగా నున్నది. అరవింద ములు పూచియున్నవి. తటములయందుఁ జెట్లు సొంపుగా నున్నవి. ఈసరస్సు చెంతనుండు నరణ్యము సొగసుగ నున్నది. ఇందలిచెట్లు పెనుశాఖలతోఁ గూడి శిఖరములుగల కొండల వలె నున్నవి. భరతుఁడు మనవలెనే నగరబహిఃప్రదేశమున

---

*ఇయ్యది కిష్కింధాకాండమున మొదటిసర్గమునఁ గల కథ. ఇం దధ్యాత్మరామాయణకథయుఁ గలిసియుండును.

దినములు నెట్లు శ్రమించుచున్నాఁడని, సీత యపహరింపఁ
బడినదని యీ రెండుదుఃఖములు నన్ను బాధించుచున్నవి.
ఇట్టి నన్ను వసంతుఁడు మిగుల బాధించునట్లున్నది. దుఃఖపడు
వాని మనస్సున కేదియు బాగుండదు. దుఃఖితుఁడ నగు
నాకుం గూడ మహారణ్యపరివృతమగు నీసరస్సు రమ్యముగా
నున్నది. ఇందుఁ గొండచిలువలు సర్పములును దిరుగుచున్నవి.
కమలోత్పలములు సందులేక క్రందుకొని యున్నవి. మృగ
పక్షులు విశేషించి యున్నవి. ఈకారణములవలన నీయది
చూడఁదగియున్నది. శాద్వలములు నీలపీతవర్ణములు గలిగి
పుష్పములు పైనుండి రాలి నిండియుండుటచేసి రత్నకంబళము
పఱచిరా యన్నట్లున్నవి. వృక్షాగ్రములు పుష్పములచే నిండి
యున్నవి. నిండుగఁ బూచియున్నలతలు వృక్షములను జుట్టు
కొనియున్నవి. సౌమిత్రీ! వసంతర్తువు వచ్చినది. వాయువు
హాయిని గల్గించుచు వీచుచున్నది. కామవికారము పెరుగు
చున్నది. సువాసనలు వ్యాపించుచున్నవి. పుష్పఫలములు
చెట్లనిండ నున్నవి. నీటిధారల వలెను మేఘముల రీతిగాఁ
బూలసోనలఁ గురియు వనములం గాంచుమా. నిర్మలశిలా
ఫలకములందు వృక్షములు వాయుకంపితములై పూవులు
చల్లుచున్నవి. గాలికిఁ గొన్నిపూవులు నేలఁబడియుఁ గొన్ని
పడుచుఁ గొన్ని చెట్లయందే నిలిచియు నెట్లు సొంపుగా
నున్నవో కనుఁగొనుము. వీనిం జూడఁగా వాయుదేవుఁ డెల్ల
యెడలఁ బూలతోఁ గ్రీడించుచున్నట్లున్నది. వాయువు పుష్ప
శాఖలను గదలింపఁగా నాపూలయందున్న తుమ్మెదలు చెల
రేఁగి వాయువును జుమ్ముజుమ్మని గానము చేయుచున్నవి.
నటులచే నాట్యము చేయించుచు వెనుకనుండి పాడుచుండు

వానింబోలి వాయువు వృక్షములచే నాట్యము సేయుచున్న,
గ్రొవ్విన కోకిలలనినాదములనెడు చక్కని గానము చేయు
చుఁ, గొండగుహానుండి వెడలి యురుమెడు చున్నాఁడు. ఈవా
యు వతివేగముగా వీచుచుఁ గదలించుచుండఁ జెట్లశాఖ లొక్కొ
యొండొంటితోఁ గలిసి గ్రుచ్చఁబడినదండవలె నున్నయవి.
చూడుమా యీగాలి సుఖముగా వీచుచు మలయజపంకముచేఁ
జల్లనై మంచి వాసనలుగలిగి మార్గాయాసములు వోఁపునట్లు
విసరుచున్నది. మకరందములు పరిమళించు వనములం దీ
చెట్లు గాలి కదలింపఁగా తేఁటులరొదలచే మొట్ట పట్టుచున్న
ట్లున్నవి. కొండలు చఱియలయం దొప్పుశిలాఫలకముల
మొలిచి పూవులు నిండుగాఁ బూచి సొంపుగానుండు నీవృక్ష
ములు తమ కొసభాగము లొండొంటితోఁ గలియుఁగా నెంతో
వింతగాఁ గనంబడుచున్నవి. అంతియగాక యివి కొనలయందుఁ
బూవుజొంపము లావరింపఁగా గాలితాఁకునకు నూఁగుచుఁ
గొసలఁ దుమ్మెదలు మూఁగి నల్లగ నుండుటంజేసి పూలు
ముడుచుకొని నల్లని తలగుడ్డలు చుట్టుకొని తలలాడించుచుం
బాడుచునుండు గాయకులవలెఁ గానఁబడుచున్నవి. కొండ
గోఁగులు పయిని బూవు లలముకొనఁగాఁ గనకాభరణములఁ
దాల్చి పీతాంబరమును గట్టిన మానవులంబోలి యెల్లయెడలఁ
గనఁబడుచున్నవి.

సౌమిత్రీ! యీవసంతము నానాజాతిపక్షులు రొదలు
చేయుటంజేసి సీతావియోగమున నున్న నన్ను శోకమున
స్రుక్కఁజేయుచున్నది. మన్మథుఁడు శోకాక్రాంతుఁడ నగు
నన్ను నెంతయుఁ దపింపఁజేయుచున్నాఁడు. కోయిల వగ పెల్లున
నుడుకు నన్నుం గాంచి పెల్లుబ్బి సంతసమునఁ గూయుచు

నాతో మచ్చరించున ట్లున్నది. తమ్ముఁడా! యీసెలయేటి యందు జలకుక్కుట మార్చుచు మన్మథార్తిం గుందు నన్నుం గని సంతసించి యింకను దుఃఖింపఁ జేయుచున్నది. పూర్వ మాశ్రమమున నున్నపుడు ప్రేయసి జలకుక్కుటధ్వని నాలకించి ప్రియముగొని నన్నుఁబిల్చి నానాక్రీడల ననుభవించును. పలువిధములగు రంగులుగలపక్షులు పలుభంగుల నినాదము లొనర్చుచు వృక్షములను గుల్మములను లతలను వ్రాలుచున్నవి. కనుఁగొనుము. ఆఁడుపక్షులు పతులచేఁ గౌఁగిలింపఁబడి తమజాతిపక్షులు ప్రియుని దగినవానిని బొందితివని నుతింపఁగా మదించిన తుమ్మెదలఝంకారములను దృప్తిపడి పతికూజితముల సొంపుగాఁ జేయుచున్నవి. జలకుక్కుటధ్వనులచే, పుంస్కోకిలములరుతములచే నిభూరుహములు ధ్వనించునట్లు కనఁబడుచును నాకెంతయుఁ బ్రీతి గొలుపుచున్నవి. ఈ వసంతర్తువే యగ్నిగా నన్నుఁ గాల్పఁగలదు. ఈయగ్నికి రక్తాశోకపుష్పగుచ్ఛమే కొఱవి. భ్రమరఝంకారములే జ్వాలామాలికాసమయధ్వనులు. చిగురులే యుజ్జనిమంటలు. సౌమిత్రీ! నయనశిరోరుహములయందము మధురభాషణములుగల యాజానకిం గాంచకయేయున్న నాకీ జీవితముతోఁ బ్రయోజన మేమియుఁ గలుగదు. ఈవసంతము సకలవిధముల సొంపుగా నున్నందున నాప్రియుసి కెంతయు నిష్టమైనది. ఇప్పటి నాయీదుఃఖాగ్ని మన్మథపీడాసంజనితము. అది యీవసంతర్తు రామణీయకమున వృద్ధియైనది. కాన నన్నిది యింక వేగమ కాల్పఁగలదు. నాప్రేయసిం గాంచక యీవసంతర్తు సంపత్సంపూర్ణములగు నీవృక్షాదులను జూచుచుండు నాకీసంతాపము మఱింత వృద్ధి కాఁగలదు. ప్రాణేశ్వరి కనఁబడకయుండుట, యీ వాసంతిక

పుష్పాదులు నిరంతరము కనంబడుచుండు టను హేతువుచే నా
సంతాపము వరుసంగా వృద్ధిబొందుచున్నది.

ఈ వనవసంతవాయువులు హారిణాయితలోచన యగు
ప్రియురాలిని స్మరించుచు దుఃఖించు నన్ను నెన్నియుపాయముల గని
కరములేక యెంతయు బాధించుచున్నవి. మయూరములు నెంతే
యు వింతగా నాడుచున్నవి. వనమయూరము లవి తమప్రియు
రాండ్రు చుట్టుకొనియుండ వేడుకగా నలుపుచుం బూర్వమే
సంతప్తుఁడ నగునాకు మఱింత సంతాపమును గల్గించుచున్నవి.
తమ్ముఁడా! కొండచఱియలయందు లీలానర్తనము చేయు తన
ప్రియునింగాంచి యీయాఁడునెమిలి ప్రేమాతిరేకమున నతని
రావింపఁగోరి చెంత నర్తనము చేయుచున్నది. చూడుము.
పురుషమయూరముకూడఁ గలయికకోరి శృంగారపుపక్షద్వ
యము విప్పి సొగసగు మొగమున విరహవేదనాయుక్తచిత్తుఁడ
నగు నన్నుఁ బరిహసింపఁగోరినట్లు తనప్రియురాలి చెంతకరుగ
నుంకించుచున్నది. ఈ యాఁడునెమిలిని రాక్షసుండు నని నప
హరించుకొనిపోలేదు. కావున నీదంపతులు సంతసమున
నర్తనము చేయుచున్నవి. ఈవసంతకాలమున జానకింగూడని
నేను వనవాసముఁ జేయఁజాలను.

వత్సా! పురుషుఁడు కాంతను వెంబడించునని లోక
మున విఖ్యాతమే. ఈవైపునకు దృష్టిని మరలింపుము. ఈ
యాఁడునెమిలి నికామకామమునఁ దానే ప్రియునిచెంత కరు
గుచున్నదే. తిర్యక్కులయందును స్త్రీలకెంత యనురాగము
న్నదో చూచితివా. కాములకుం గూడ నీప్రేమాతిశయ
విశిష్టభావమును గల్గించుచుండు నీవసంతవైభవ మెంత వర్ణ
నార్హమో పరిశీలింపుము. జానకియు రాక్షసాపహృతయే

గానఁబున్న నన్నిక్లే యెదుర్కొనియే వచ్చునుగదా. వాసం తికపుష్పగుచ్ఛము లెంత సొంపుగానున్నను నీనిప్రయోజనము నాకు లేకున్నది. ఈపూవుగుత్తులు తేనియలఁ గ్రోలుటకై వ్రాలుతుమ్మెదలతో నిరర్థకముగాఁ గ్రింద రాలుచున్నవి. పటు బును నాకుఁ గామవికారమును గల్గింపఁ గోరి కాఁబోలు గుము లుగాఁగూడి సంతసమున రుతములు గావించుచున్నవి. ఎందు నాసీతయుండునో యందీ వసంతర్తువుండిన నావలె నెంతయు దుఃఖించును గదా. రక్కసు లాజానకి నెందో రహస్యస్థలమున నునిచియుందురు. కనుక నాచోట నీబుతు వుండదనుట నిశ్చయము. వసంతర్తువు లేనికతన జానకికి నగవేదన వచ్చు నొకో. నావియోగమున నాసీత బ్రదుక నేర్చునే. నాపైఁ గల ప్రీతిని బ్రాణముల నందే విడువఁగలదు. జానకి మహాపతి వ్రత. నాకడ లేదు. కాన జీవింపఁజాలదు. మేమిరువురము పరస్పర దృఢానురాగము కలవారము. కాన నీవాయువు సుఖముగలుగ వీచుచున్నను సీతలేమి నాకు నగ్నిస్పర్శమువలె నున్నది. సీత నాచెంత నుండుతఱి సుఖముగూర్చు నీమంద మారుతము తద్వియోగమునఁగుందు నాకిత్తఱి దుఃఖప్రదమే యగుచున్నది. ఏకాకి పైనుండి బిట్టుగాఁ గూయుచు సీతా వియోగమును దెలిపెనో యాకాకియే యిపుడు సంతసమునఁ గూయుచు సీతాయోగమును దెలుపుచున్నది. ఇదియే జానకి నెడఁబాపినది. ఇపుడు నన్నటకుఁ గొంపోవఁ గలదు. వృ క్షాగ్రములపయిఁ బక్షులు మధురరుతము లొనరించుచున్నవి. ఆనాదము నాకుఁ గామోద్దీపకముగా నున్నది. గాలింగదలు బొట్టుగుచెట్టు పూవుగుత్తిని దీని నీభ్రమరము మదమున నటు నిటు నల్లలలాడు ప్రియురాలినిం బోలి త్వరపడి పైకొను

చున్నది. అశోకవృక్షము మీయుది నైజముగా వినవలసి... వృద్ధికరము. అది ఎఱ్ఱనిపూగుత్తులు కలదియుండుటచే ... సమా! నిన్నడంపఁగోరి యీ దీప్తబాణములను గామునిచే నా... దునిచినాఁడని నన్ను భయపెట్టున ట్లూహింపఁబడుచున్నది. పూచిన యీరసాలవృక్షము చందనచర్చలుగల కాముని వలెఁ గనఁబడుచున్నది.

పంపాతీరమున గలవనములయందు ... లును విహరించుచున్నవారు. నలుదెసలఁ బరికింపుము. ... ముల వెదఁజల్లు నీతామరలు జలతరంగములయందు ప్రతి ఫలించు బాలభానులవలె నొప్పుచున్నవి. నిర్మల... కమలోత్పలములు సౌగంధికములును గలిగి యీ పంపాసరో వరము జలవిహంగములతో నెంతో వింతగ నున్నది. చక్ర వాకములతోఁ గూడి కట్టుకొన్న వస్త్రమువలెఁ దీరగత... విలసిల్లుచు జలములం గ్రోలవచ్చిన గజవిసరములచే మృగ సముదయముల చేతను నిరంతరము సొగసుగానుండు ... సరస్సును జూడుము. పద్మపత్రాయతాక్షములుగలిగి ... కమలవిషయకప్రీతి గలిగియుండు సీతను జూడక నేను బ్రదికి యుండుట మేలు కానేకాదు. అహా! మదనుని దౌష్ట్యము! మృగమును బట్టి నాకిమ్మనిన యాకల్యాణి నన్ను వదలి దూర ముగా నరిగి దుర్లభయైయున్నను నాకుఁ బ్రతిక్షణ మామెను స్మృతికిం దెచ్చుచున్నాఁడే. ఈపుష్పవనములు నన్ను నింతగాఁ బీడింపకయున్న నేనీమన్మథతాపము నోర్చుకొనియుందును. ఆజానకి నాచెంత నుండునపుడు ప్రియములుగా నున్నపదా ర్థము లామె నెడఁబాసియుండు నాకు మిక్కిలి వగపుఁ గల్గించు

నున్నవి. కమలకుట్మలములపయిని వెళముల(?) జూడఁగనే సీత నేత్రపక్ష్మములు స్మృతికిం దగులుచున్నవి.

పంకరుహాకేసరములం గూడి వృక్షములయంతరముల నుండి వచ్చువాయువు జానకినిట్టూర్పువలెఁ బరిమళములతో సొంపుగా వీచుచున్నది. పంపాదక్షిణాతీరమునఁ బర్వతసాను తలమునఁ గర్ణికారలత విశేషించి పుష్పించి సొగసుగానున్నది. చూచితివా. సకలధాతుసంయుతుఁడగు నీపర్వతరాజు వాయు వత్యంతము వీచుచుండఁగా విచిత్రవర్ణరజస్సును వదలుచున్న వాఁడు. కనియఁబూచిన పలాశవృక్షములు పత్త్రములే లేక యుంతో సొంపుగా నున్నవి. ఆసానువు లావృక్షములచే జ్వాలామాలికల మండుచున్నవలెఁ గనంబడుచున్నవి. ఆసాను వులయం దెన్నియోవిధము లగువృక్షములు వికసించియున్నవి. తీఁగలు చుట్టుకొనఁగా నీపుష్పవృక్షములు విశేషించియుండు నీసరోవరమును జూడుము. గాలికిఁ గొమ్మ లల్లాడఁగాఁ బ్రియ కాంతలు ప్రియుఁ దెటుపోయినను వదలక వాని ననువర్తించు నట్లు లతలుకూడ ననుసరించుచున్నవి. వాయువు తరువునుండి తరువునకుఁ గొండనుండి కొండకు వనమునుండి వనమునకుఁ బోవుచుఁ దీయనిరసములం గ్రోలి తృప్తిఁబొందనివానిరీతి మందముగా వీచుచున్నది. వృక్షము లెన్నోవిధముల వింత వింతగాఁ గనఁబడుచున్నవి. తుమ్మెదలు రుచిఁదగిలి దేనిని వదలఁజాలక క్రొత్తపూవులపై వ్రాలుచున్నవి. ఎల్లతావులఁ గ్రుమ్మరుచున్నవి. పూవులు రాలి మెత్తనిపాన్పుపఱచిన ట్లున్నది. ఈ వసంతర్తువునందుఁ దరువులు కనియఁబూచి యొకదానిని వేఱొకటి మించవలయునను తలంపుగలిగిన ట్లున్నవి. ఈ సరోవరమునకుఁ గలరూపమువలె మందాకినికిం గూడ

రూపము సొంపుగానుండును. అట్టి గుణములు కనఁబడుచు
న్నవి. పరాపహృతయైన సేమిగాని యాసీత మనయోధ్య.
ఆజానకి కనఁబడునేని మనమందఱ మిచ్చటనుండి మని నే
నయోధ్యనే కాదు మహేంద్రపదముఁ గూడ నాశించను.
ఈశాద్వలముల నే నామెం గూడియుందునే నయోధ్యలేని
చింత నాకుఁ గలుగనే కలుగదు. మఱి దేనియందు నా కాశ
యుండదు. తటములయందు వరాహములు హరిణములు విహా
రించుచున్నవి. పక్షులెంతయు మనోజ్ఞరుతములు చేయుచుం
డఁగా నీసరస్సు సంతోషమును గల్గించునదిగా నున్నది.
ఇందలి మనోహరపదార్థములన్నియు నాకు వింత పరితాప
మును గల్గించుచున్నవి. ప్రియురాలు నాకుఁ గనఁబడునేని
నెమ్మదిగ నుందును. ఈ మలయమారుతమును ప్రియురాం
డ్రతోఁ గూడినపుణ్యాత్ములే యనుభవింతురు. ప్రాణత్యాగ
మున స్వతంత్రురాలు గాక పరవశయై సీత నన్నువదలి యెట్లు
ప్రాణముల నిలుపుకొనియుండును ?

ధర్మజ్ఞుఁడగుజనకరాజు సీతాకుశలవార్తను నన్నడు
గఁగా నేమని బదులుచెప్పుదును? తండ్రి న న్నడవికిఁ
దోలఁగా నిర్భాగ్యుఁడ నగు నన్ను సాధ్వియగు సీత యనుస
రించివచ్చినది కదా. ఆసాధ్వి యిప్పుడెందున్నది? నే నామెలేక
యెట్లు బ్రదుకుదును? శుభములొనఁగూర్చు నామె నగుమో
మును జూడకయున్న నామనస్సు స్రుక్కక యుండఁగల్గునా?
ఆసతి ప్రియవచనములు పలుక నెపుడు వినఁగలను? నాసంతాప
మును హరించు నా సీతమాటలు వెండియు వినఁగల్గుటెప్పుడు?
రాజకుమారా! అయోధ్యకు నేనుబోవఁగనే దుఃఖాతురయగు
కౌసల్య నన్నుఁ గాంచినంతనే నాముద్దుల కోడలేది? అనిన

నేమందును? వత్సా! నీవరిగి భరతుని గాంచుము. నేనాజానకి విడిచి రాఁజాలనని విలపించెను. అనాథునిం బోలి విలపించు నాజానకీధవుం గాంచి యుక్తవాక్యముల నిట్లు మందలించెను. పురుషోత్తమా! ధైర్యము దెచ్చుకొనుము. నీకు భద్రమగుఁ గాక. మీవంటివారిబుద్ధి యించుకయుఁ గలుషితము కాదు. మిగుల నెయ్యముంచినందున నొకప్పుడు వియోగము కలుగ దుఃఖము కలుగునన్న నానుడి తలంచుకొని యధికస్నేహము విడువుము. అధికస్నేహముండినఁ దడిసినవత్తియు దహింపఁ బడుఁగదా. శ్రీరామభద్రా! పాతాళమునకుఁగాని యంతకు మించిన యున్నతస్థలమునకుఁగాని పోయినను రావణుఁ డింక బ్రదికియుండఁజాలఁడు. ఆదురాత్ముని జాడయొక్కటియే మనకుఁ దెలియఁదగినది. అంతట వాఁడు జానకినో ప్రాణములనో యీయక యుండలేఁడు. సీత నపహరించి యదితిగర్భమును బ్రవేశించిన నందుఁగూడ సీతనీకున్న వాని వధింతును. ధైర్యము భద్రప్రదము. కాన దాని నూనుము. ఈదైన్యమును వదలుము. ధైర్యము మాని యత్నము చేయకయుండువారల కేదియును సిద్ధింపదు. ఉత్సాహము ప్రబలము. దానికన్న నెక్కువబలము లేదు. అదిగలవారికి దుర్లభ మేదియు లేదు. ఉత్సాహవంతుఁ డెంతదైనను క్లేశముం గనఁడు. మనమాయుత్సాహము గలవారమైన జానకిని బడయఁగలము. దుఃఖమును వర్జించి యీమన్మథవికారమును జయింపుము. మహాబుద్ధిసంపన్నుఁడవగు నీవిపుడు నిన్నే మఱచియున్నాఁడవు. అని యన్న కూరటగలుగునట్లు పలికెను.

శోకమున బ్రుంగియున్న శ్రీరాముఁడు తమ్ముఁ డట్లుబోధింపఁగా శోకమోహముల నవలి ధైర్యము నాశ్రయించెను.

అంత నాసరస్సును దాఁటి యవ్వలిచోటికిం బోయెను. ఇట్లు సోదరు లంతట వెదకిరి. శ్రీరాముని కూటిగలుగు రాజసగుణములఁ దెలుపుచుఁ దనబలమును బ్రశంసించుచు [illegible] లక్ష్మణుఁడు భ్రాతృసేవాతత్పరుఁడై యుండెను. సుగ్రీవుఁడను వానరరా జొక్కరుఁ డన్నభయమున ఋశ్యమూకాద్రి యొప్పు నఁ దిరుగుచుండెను. పంపాసరస్సమీపమునఁ దిరుగు సోదరులఁ గాఁ జూచువారల నచ్చెరువందఁ జేయు నాసోదరులఁ గాంచెను. భయమున నిశ్చేష్టితుఁ డయ్యెను. పంపాసమీపమునఁ దిరుగు నాసోదరులఁ జూచి వారియాకారవిశేషమునకుఁ జింతిల్లి భయ సాగరమున మునింగి విషాదమునొందెను. అతఁడే కాని వాని మంత్రులును సోదరులం గాంచి వారు వాలిపనుపున మునివేష ముల నరుగుదెంచి రన్న శంకచే దిగులుపడి మహాపుణ్యస్థలమ మగు మతంగాశ్రమములోనికిం జొచ్చిరి.

మహాశయులారా! ఈసర్గమున విశేషాంశములు లేవ నియే తొలుతఁ దోఁచు. విమర్శించిన ననేకధర్మము లిందుఁగల వని యేర్పడును. వాని నెమకుదము. "రామాన్వేషణేన భగ వతశ్చేతనోజ్జీవనోపాయచింతనం చోక్తం మారణ్యకాండే. అథాచార్యముఖేన చేతనస్య స్వవిషయ భక్త్యుత్పాదనకృతే తదన్వేషణ ముచ్యతే కిష్కింధాకాండే" అని గోవిందరాజులు వ్రాసిరి. "ఇదానీమస్మిన్ కిష్కింధాకాండే తదేవ సుగ్రీవ సఖ్యం చ వక్తుమనాః ప్రసంగాత్పురుషధౌరేయాణామపీష్ట జనవియోగినాం కామోద్దీపకదర్శనేన చిత్తవిభ్రమో భవ తీతి సూచనాయ పంపావర్ణనముఖేన రామస్య చిత్తవిభ్రమం దర్శయితు ముపక్రమతే" అని టీకాశిరోమణి వాకొనియెను. ఆచార్యముఖముననే భగవత్కృప లభింపవలయుఁగాని మా

ర్గాంతరము లేదను న్యాయము ననుసరించి తదనుకూలముగా నర్థమును గోవిందరాజులు వ్రాసిరి. ఎట్టిపురుషులనుఁగాని కామోద్దీపకములగు పదార్థములను జూడఁగనే చిత్తము చంచలించును గాన స్త్రీవస్తువులు కనఁబడినందున లోకాచారము ననుసరించు రామమూర్తికి నార్తికలిగెనని టీకాశిరోమణి తాత్పర్యము. ఈరెండిటియందు యుక్తమేది యని విచారింతము. గోవిందరాజులుగారి భావమునకుఁ బ్రకృతవిషయమునకు సంబంధము లేదు. రెండవవారిభావమునకు సంబంధము కలదు. మొదటివారిభావ మాకాశరామన్న పంచాంగమువంటిది. మతాభిమానము ననుసరించి రామాయణ మావిషయమునే బోధించునని తెలుపఁబూనినవారు గోవిందరాజులు. వీరి వ్రాఁతల నాధారముచేసికొనియే కొందఱు పెక్కండ్రు రామాయణము వైష్ణవులకొఱకే యేర్పడిన గ్రంథమందురు. శరణాగతినే బోధించునందురు. భగవత్కథ యొక్కమతమువారికే ముఖ్యమగునెడల నది యుత్తమమే కాదు. ఆతఁడు భగవంతుఁడే కాఁడు. సర్వమతములవారి కది సమానముగనే యుండవలయు. ఈధర్మమునే యీశ్రీరామాయణతత్త్వము బోధించుచున్నది. ఇఁకఁ బరికింతము. ఇందుఁ బ్రధానములనే తెలిసికొందము.

> "శోకార్తస్యాపి మే పంపా శోభతే చిత్రకాననా,
> వ్యవకీర్ణా బహువిధైః పుష్పైః శీతోదకా శివా."

అని మూ. "సర్వేషు మద్భక్తేషు సుఖం వసత్సు సమర్థమితే సంసారిణః క్లిశ్యంతీత్యభిప్రాయేణాహ" అని గోవిందరాజులు. ఇది యసంగతమే యనవలెను. తనభక్తులు సుఖముగ నుం

డఁగాఁ దానేల శోకార్తుఁడు కావలయును? తెలియుము. అపుడు భక్తులకన్నఁ దానే యతిశుద్ధమనస్కుఁడని [illegible]మే ర్పడును. మన మిట్లు గ్రహింతము. [illegible] పుష్పముల రాల్చుచుండఁగా శీతజలములు గల సరస్సు గనఁ బడినయెడల నెట్టిదుఃఖములైన నివర్తించును. పరోపకారమున కుదాహరణభూతములు వృక్షములు. నిర్మలాంతఃకరణము నిచ్చునవి జలములు. కావున నట్టివాని దర్శించినంతనే శోక ములు తొలంగును. సంసారబాధలనుండి విముక్తిగాంచుటకే సాధువు లడవుల కరుగుదురు. అందుఁ బ్రాయికముగా దుఃఖ ములు బాధింపవు.

"అధికం ప్రతిభాత్యేతన్నీలపీతం తు శాద్వలం,
ద్రుమాణాం వివిధైః పుష్పైః పరిస్తోమైరివార్పితం."

అని మూ. "అనేన నానాకుసుమఖలభూషణతయా భగవద్దర్శ నయోగ్యః పురుష ఉచ్యతే" అని గోవిందరాజులు. సద్గురువుల నాశ్రయించి వారిమూలమున జ్ఞానము సంపాదించు కొన్న పురుషుఁడు భగవద్దర్శనయోగ్యుఁ డగునని ఆచార్యుల గారి భావము. ఉన్న ధనమంతయు నాచార్యులకుఁ దక్షిణ[illegible] కిచ్చి విజ్ఞానవంతుఁడయినఁగాని భగవంతుఁడు వానియందుఁ గాపురముండఁడు కాఁబోలు. మెచ్చవచ్చు నీభావము. మన మిట్లు భావింతము. పచ్చికపట్లు విశాలభావమును గనఁబఱచును. వృక్షములు పువ్వుల నొసంగి చిత్రవర్ణముగా వానిం గావించి నట్లు విశాలభావముగలవారలు ప్రార్థింపకున్నను సాధువులు తోడ్పడి పరితుష్టులఁ గావింతురు. నిర్మలమన స్సొకటియున్న యెడల నయ్యది సర్వజనుల నాకర్షించును. దానవే కొఱంతలు గలుగకయుండునను భావము నియ్యది తెలుపుచున్నది.

"పుష్పభారసమృద్ధాని శిఖరాణి సమంతతః,
లతాభిః పుష్పితాగ్రాభి రుపగూఢాని సర్వశః." ౯

అని మూ. "అనేన గార్హస్థ్యేఽపి నిరవధికబాధా ఉచ్యంతే" అని గోవిందరాజులు. ఇది సముచితముగా లేదు. మన మిట్లు గ్రహింపందగు. వృక్షములకుఁ బుష్పములే భాగ్యము. లత లవ్వానిం బెనుచుకొనుట స్వభావము. వానింజూడఁగా ధన సమృద్ధినిగల పురుషులనే సాధారణముగా స్త్రీలు కామింతు రనియు నది లేనివారల నంతగా నభిలషింపరనియు మన మెఱుంగవలయు.

"పశ్య రూపాణి సౌమిత్రే వనానాం పుష్పశాలినామ్,
సృజతాం పుష్పవర్షాణి తోయం తోయముచామివ." ౧౧

అని మూ. "అనేన పరోపదేశప్రవృత్తా ఆచార్యా ఉచ్యంతే" అని గోవిందరాజులు. ఆచార్యులవఱకే మనమిట్లూహింతము. మేఘము జలముల నొసంగును. వృక్షములు పూవుల నొసం గును. అట్లే సాధుమతులగువారు తమయన్న యుత్తమవస్తువు లను దామనుభవింపక యితరుల కుపకరింపఁ జేయుదురు అని. దీనిచే స్వపరభేదరహితులే జ్ఞానులని మన మెఱుంగవల యును. సద్వస్తుత్యాగబుద్ధియే జ్ఞానులయందలి గొప్పతనమని సారము.

"మత్తకోకిలసన్నాదై ర్నర్తయన్నివ పాదపాన్,
శైలకందరనిష్క్రాన్తః ప్రగీత ఇవ చానిలః." ౧౫

అని మూలము. "అనేన వేదప్రవర్తనముఖేన లోకస్య భగవ త్ప్రాదనాయ వైకుంఠాదవతీర్ణో భగవా నిత్యుచ్యతే" అను నీ గోవిందరాజోక్తి స్వమతాభిమానద్యోతనము. ఇందలి సా

మేమనఁగా. ధనమదమునఁ గాఁడిపోలుఁగాక స్వేచ్ఛఁగను నిచ్ఛానుసారముగా వర్తించుచుండువారు పర్వతముం బోలినదనఁగా నీలవర్ణముగల సత్కృత్యము గావించుచుండును. భయంకరకర్మముల నాచరించువారలే మిన్నగుదురనియు వారికి సంసారమే సంతోషప్రదమగు స్వస్థానాగారమనియు మన మెఱుఁగవలయును. అట్టివారి స్థితిగతుల నెఱుంగఁదగుననియు దానిమూలమున సద్గోష్ఠినుండి విరక్తుఁడు కావలయుననియు మనము నేర్చుకొనవలయును. వైకుంఠము శాశ్వతలోకమని ఆచార్యులవారిభావము కాఁబోలు. అట్టివి యెన్నియో యుండును. అన్నియు శాశ్వతములైన నశించునది యేదియో తెలియదు.

> "తేన విక్షిపతాత్యర్థం పవనేన సమంతతః,
> అమీ సంసక్తశాఖాగ్రా గ్రథితా ఇవ పాదపాః." ౧౬

అని మూలము. "అనేన భగవత్కృపయా పరస్పరమనురక్తా భాగవతా ఉచ్యంతే" అని స్వాములు. సత్కర్మము నానా ముఖముల వ్యాపింపఁగా దానిచేఁ బ్రోత్సహింపఁబడి సాధువులు దర్శనమాత్రమునఁ దమవంటి సత్కర్మానుష్ఠానపరుల నెఱుంగఁగలరు. అను నీనీతిని వృక్షములు మనకు బోధించుచున్నవి.

> "పుష్పితాగ్రాంస్తు పశ్యేమాన్ కర్ణికారాన్ సమంతతః,
> హాటకప్రతిసంఛన్నాన్నరాన్ పీతాంబరానివ. ౧౭

అని మూలము. "అనేన భగవత్సారూప్యం గతా ఉచ్యంతే" అని యాచార్యులు. పీతాంబరమును భగవంతుఁడు ధరించు

అన్న శ్రీకృష్ణవాక్యము నిరర్థకమగును. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనునదియే పరమశ్లోకమని భావించు నాచార్యులకు సత్కర్మము లనవసరానుష్ఠానములని యెట్లు తోచును? ఇద్దానినుండి గ్రహింపవలసినది యేమని ప్రశ్నము. సంతుష్టులగువారు ఇతరులను వరుసగనే భావింతురు. ఇతరుల శ్రమములు తెలిసికొనజాలరు. శ్రమపడువారిని దెలిసికొనుటయే యుత్తమకార్యము. కోకిలము నుదాహరణముగాఁ జూపి శ్రీరాముఁ డీనీతిని మనసుఁ దెల్పుచున్నాఁడు. కర్మఠులు భగవంతుని నుచ్చరింపరు. సత్కర్మముల నారాధింతురు. "కర్మిభ్యశ్చాధికో యోగీ" అన్న భగవద్వాక్యము నరయుఁడు. సకలలోకములు కర్మాధీనములు. కర్మ మత్యధికము. "గహనా కర్మణో గతిః" అని భగవంతుఁడే తెలిపెను.

> "భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం,
> సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి.
> కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి,
> యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే."

అను నీగీతావాక్యములు కర్మస్వరూపమును దెలుపుచున్నవి. కర్మఠు లెపుడును సత్కర్మముల నాచరించి తత్ఫలములను భగవంతున కర్పింతురు. ఆత్మశుద్ధి సత్కర్మానుష్ఠానము లేక కలుగ నేరదు. శరణాగతి యనుదంభమున సకలకర్మముల నవదలుకొనువారు భ్రష్టులే యగుదురు. భక్తి యనునది వారికి భుక్తిగా మారును. కర్మమార్గమున భగవంతు నారాధించువారికి భగవదనుగ్రహము కలుగదనుటకంటె నసంగతప్రలా

